55/5

శ్రీ

# కిన్నరీవిజయము.

ఆదిపూడి సోమనాథరాయ

ప్రణీతము.

మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

స్కేప్ అండు కో., ముద్రాక్షరశాల.

1920



[వెల 0-12-0.

# విన్నపము.

కడచిన వేసవిని గార్మ్యాంతరము మీఁద నేను అనంత పురము జిల్లాలోని పెనుకొండకుఁ బోయి యుండి నామిత్రులగు మ॥ శ్రీ టి. శివశంకరముగారి యింటబసచేసి యుంటిని. వారు నాకు (Thomas Moore) థామస్. మూర్ అను కవీంద్రుఁడు ఆంగ్లమున రచించిన (Paradise And the Peri) ప్యారడైజ్ అండ్ పెరి అను చిన్ని కావ్యరత్నము నిచ్చి యిది తెనుఁగున నుండిన బాగుండుననిరి. నేనప్పుడాపుస్తకమును జదివి మిక్కిలియానందించితిని. కాని మహోన్నతాశయ సమన్వితమై నవరస భరితమై నానావిధశబ్దార్థాలంకార శోభితమై పండిత పామరులకును స్త్రీపురుషులకును బాలవృద్ధులకును బఠింపఁదగినదియునైన యీయుత్కృష్ట కావ్యరత్నమును దెనిఁగించుటకు నాకు శక్తికలదా యని శంకించి యప్పటికూరకుంటిని. ఇప్పుడు పరమేశ్వరుని కృపచే నేదో యొకవిధముగఁ గిన్నరీ విజయమనుపేరఁ దెనిఁగింపఁగలిగితిని. ఆంధ్రులందఱు నీకావ్యరాజమును ధారాళముగ నుపయోగింతురు గాక.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,

ఆదిపూడి సోమనాథరావు,

పిఠాపురము, గోదావరిజిల్లా.

# అంకితము

గీ॥ అనువుమీఱఁగ సంసార ♦ యాత్రజరప
నెందఱోసాయ మొసఁగితి ♦ రెలమిఁదోడ
నందఱకుఁ "గిన్నరీవిజ ♦ యంబు" దీని
నంకితం బిచ్చి కేల్మోడ్తు ♦ నందుకొనుఁడు
మిత్రవరులార! యీశ్వర ♦ పుత్త్రులారా!

ఆదిపూడి సోమనాథరావు.



శ్రీ

# కిన్నరీ విజయము.

## గీతమాలిక.

భాసురంబగునొక్క ప్ర ♦ భాతమందు
స్వర్గనందన సుందర ♦ ద్వారసీమఁ
గిన్నరియొకర్తు నిలఁబడి ♦ ఖిన్నయగుచు
గాన పూరంబుకరణి స్వ ♦ ర్గానమ్రోయు
నమరగంగానదీ నాద ♦ మాలకించి
యఱతెఱచియున్న ద్వారమ్ము ♦ నందునుండి
పర్వతనపక్షములమీఁదఁ ♦ బఱచుచుండు
వింతగొల్పు సముజ్జ్వల ♦ కాంతిఁగాంచి
యకట! మాజాతియపచార ♦ మాచరించి
యిట్టిస్వర్లోకసుఖముఁ బోఁ ♦ గొట్టుకొనిమె
ననుచు విలపించెనశ్రువుల్ ♦ కనులనించె.

"కాలియెఱుఁగనివాడని ♦ పూలనమమ
నచట విహరించుపుణ్యాత్ము ♦ లనుభవించు
సౌఖ్యమింతని వర్ణింప ♦ శక్యమగునె?
వనధివసుధలయుద్యాన ♦ వనములెల్లఁ
జక్కలందెల్ల విలసిల్లు ♦ సుమములెల్ల
నాకమునుండిననేమి! యా ♦ నందనమున
మించు నొకపువ్వె యిన్నింటి ♦ మించిమెఱయు.

---

చారుతరమగు సరళవృ ♦ క్షంపుదీవి
పరిస్ఫుటముగఁ దనలోనఁ ♦ బ్రతిఫలింప
శీతజలపూరితమ్ము కా ♦ శ్మీరసరము
విమలతరముగ నెంతైన ♦ వెలయుఁగాక;
అచటికనుమలఁ బడిపాఱు ♦ నంబుధార
లింపుగొల్పెడు రవముల ♦ నింపుఁగాక;
'సింగుసుహె' లోని తెలినీరు ♦ చెలఁగుఁగాక;
అందలి సువర్ణపూరమ్ము ♦ లలరుఁగాక;
వీనినన్నింటిమించి స్వ ♦ ర్గానఁదనరు
నీరముల సొరుతీరు వ ♦ ర్ణించిచెప్ప
ధన్యులౌ స్వర్గవాసులే ♦ తగినవారు.

---

## కిన్నరీవిజయము.

గగనమునఁ దారతారకు నెగసిపోయి
వహ్నివప్రంబు వఱకును ♦ బర్వియుండు
కడు వెలింగెడు లోకలో ♦ కములకేగి
గోళగోళసుఖమ్ములఁ ♦ గూర్చికూర్చి
వీని నొక్కొక్కటిని మితి ♦ లేని యేండ్లఁ
బెట్టి హెచ్చింప మొత్తమౌ ♦ నట్టిసుఖము
స్వర్గమున నొక్కనిమిషంపు ♦ సౌఖ్యమగును”
అనుచు వాపోయెఁ గిన్నరి ♦ యనిలపుత్రి.

---

దేవదూతయు దివ్యతే ♦ జోవిరాజి
స్వర్గభవ్యప్రభాద్వార ♦ పాలుఁ డపుడు
వగచుచుండెడి కిన్నరి ♦ వంకఁ జూచి
చేరువకుఁ జేరి యాకన్నె ♦ చేయుచున్న
జాలిగొల్పెడు గీతంబు ♦ నాలకింప
నతని కంటను జలబిందు ♦ వంకురించి
భూసురులు నందనములోన ♦ పూచునంచు
జెప్పు నీలంపు విరిమీఁద ♦ నొప్పుచుండు
నమృతపూరంపుఁ దుంపర ♦ యట్లు వెలిఁగె.

---

అంతఁ గిన్నరిఁ గనుఁగొని ♦ యమరదూత
“ పతితమయ్యును సౌందర్య ♦ భవనమైన

వంశమందుద్భవిల్లిన ♦ భాసురాంగి!
యొక్కటేయాశ వినుము నీ ♦ కున్న దెల్లఁ;
'బరమపురుషుని శాశ్వత ♦ ద్వారమందు
నాతనికిఁ బ్రీతికరమయి ♦ యలరుదాని
నిప్పుడైనను గొనివచ్చి ♦ యిచ్చెనేని
గిన్నరిక్షమింపఁబడు'నని ♦ క్రియలఫలము
నుఁడువుపుస్తకమున వ్రాయఁ ♦ బడెనుగాన
వెదకిదానిని గొనిరమ్ము ♦ వేగఁబొమ్ము;
దురితమంతయు గిన్నరీ! ♦ తొలఁచికొనుము;
ప్రభువుచేతను క్షమియింపఁ ♦ బడినవారి
స్వీకరించుట కరము సం ♦ ప్రీతికరము;
పొమ్మ"నుచుఁ జెప్పిపంపెను ♦ నెమ్మదిగను.

---

అలరకిన్నరి యాదూత ♦ పలుకులకును
గగనమణియగు భాస్కరుఁ ♦ గౌఁగిలింపఁ
బరుగులిడు తోఁకచుక్కల ♦ వడినిబోలి,
స్వర్గవప్రంబుమీఁదికి ♦ సాహసించి
యెక్కుచెదురక్కసులనెల్ల ♦ నుక్కడంప
జివ్వమని ఱేయిదేవతల్ ♦ ఉవ్వచుండ
రభసమునఁబాఱు నుల్కల ♦ రయముమీఱి
నెగడుజవమున నీలంపు ♦ నింగికెగసి

# కిన్నరీవిజయము.

సుప్రభాతంపుఁజూపగు ♦ సూర్యచేత
వెలుఁగు భూమార్గమునుబట్టి ♦ వేడ్కమీఱ
మనవిశాలమహీచక్ర ♦ మునకు మీఁదఁ
దిన్నగావాలి వలయముల్ ♦ దిరుగఁజొచ్చె.

---

" దేవునకునిట్టి కానుక ♦ దెచ్చుటకును
నెటకువెదకంగఁ గిన్నరి ♦ యేగవలెను!
'షిల్మినార్' కంబములక్రిందఁ ♦ జెలఁగివెలుఁగు
లెక్కలేనట్టికెంపులఁ ♦ బిక్కటిల్లి
మించుకోశంపు సిరులవీ ♦ క్షించియుంటి;
దివ్యముగవెల్గు 'నరబియా' ♦ దేశమునకు
దక్షిణమ్మున మున్గి సం ♦ ద్రమునున్న
కమ్మతావులదీవులఁ ♦ గాంచియుంటి;
రంగుదళ్కొత్తు నమృతము ♦ పొంగుచుండు
మానికపు'జెంషిదు' ప్రభు ♦ పానపాత్రి
నెచటభూతాళిదాఁచెనో ♦ యెఱిఁగియుంటిఁ;
గాని యాదేవునకు నిందుఁ ♦ గానుకగాఁగఁ
దీసికొనిపోవఁదగిన దె ♦ ద్దియును లేదు.
అమ్మహాప్రభుచిత్రసిం ♦ హాసనంపు
దివ్యసోపానములవలె ♦ దేజరిల్లు

నొక్కమణియైన నెన్నఁడే ♦ నుండియున్న?
శాశ్వతానంత సింధువా ♦ స్వామి యేడ!
యీయమృతబిందులివి యేడ! ♦ యేడ కేడ!"
అనుచుఁ దలపోయుచుండి యా ♦ హైందవులకు
ధామమైయొప్పు సుందర ♦ భూమిమీఁది
గాలిగదలంగఁ గిన్నరి ♦ గరులువిసరె.

---

ఆ నెలవుగాలి సర్వతా ♦ పాపహారి;
అచటియంభోధి యుప్పొంగి ♦ యావరించుఁ
దృణమణులపట్లఁ బవడంపుఁ ♦ దీఁగెగట్ల;
ఖరకరుని వెచ్చమినుకుల ♦ గర్భమంది
నగములచ్చట మించు ర ♦ త్నాలనీను;
అలవఱిచియుంచి స్వర్ణంబు ♦ నలలక్రింద
వాగులటఁ బొల్చు ధనిక స ♦ ద్వధువులట్లు;
కమ్మపొదరిండ్లు నచ్చటి ♦ గంధవనులు
కిన్నరీకినందనమ్ముగా ♦ నెన్నవచ్చుఁ;
గాని మానవరక్తముం ♦ గలసియిప్పు
డెఱ్ఱఁగాఁ బాఱఁజొచ్చె నా ♦ యేఱులెల్ల;
గమగమలఁజిమ్ము పొదరిండ్ల ♦ గములనుండి
ఘోరమరణంపు వాసన ♦ గొట్టఁదొడఁగె;
మానవునకల్ల బలియైన ♦ మనుజతనువు

## కిన్నరీవిజయము.

సరళతర కుసుమోచ్ఛ్వాస ♦ పరిమళముచు
మలినగంధమ్ముఁ గూరిచి ♦ మైలపఱచె.

---

భాస్కరప్రియధామమా! ♦ భాగ్యసీమ!
అకట! నీగొప్పదివ్యదే ♦ వాలయముల
నూడకంబాల నీడల ♦ నొప్పువనుల
నద్భుతంబుగఁ దనరు గు ♦ హాలయముల
విగ్రహాకృతిగాంచిన ♦ విపులశిలల
నవనిపాల సహస్రసిం ♦ హాసనములఁ
బాడుపఱుపంగ దండెత్తి ♦ వచ్చెనెవఁడు?
'ఘూజనీ'కద! క్రూరుఁడౌ ♦ 'ఘూజని'కద!
అతనిధాటికి ముందట ♦ నకట! చెదరి
యూర్వరాజకిరీటమ్ము ♦ లవనిఁబడియె;
నంతిపురినున్న జవరాండ్ర ♦ నఱుతనున్న
వజ్రభూషలఁ దెగఁద్రెంచి ♦ వానినెల్ల
వేఁటకుక్కల మెడలందు ♦ వ్రేలఁగట్టె;
రాచకన్నెల నంతఃపు ♦ రమ్మునందె
అకట! పూజారులను నాల ♦ యమ్ములందె
కరుణయొక్కింతలేకుండ ♦ నఱికివైచె;
నట్టెపడఁగొట్టె దివ్యదే ♦ వాలయముల
నందు వెలిఁగినమణిభూష ♦ ణాళిచేతఁ

బుణ్యనదులను గటకటా! ♦ పూడ్చివైచె.

---

అపుడు కిన్నరి యెఱ్ఱని ♦ యావినుండి
క్రిందిరణభూమిమీఁదికి ♦ దృష్టిపఱపి
కాంచెఁదనసీమ నదిచెంతఁ ♦ గ్రాలువాని
నిలఁబడినవాని నెలప్రాయ ♦ మొలయువానిఁ
గేలవిఱిగిన యెఱ్ఱని ♦ వాలువాని
శరధిలోనున్న యొక్కటే ♦ శరమువాని
యోధవర్యుని నొంటిగా ♦ నున్నవాని.

---

జయముగొని విఱ్ఱవీఁగు 'ఘూ ♦ జని'యు నంతఁ
బహుచువాఁడగు నాయోధ ♦ వరునిఁగాంచి
నేనుగెలిచిన మకుటాది ♦ నిఖిలవస్తు
చయములను బాలుగొనుము నా ♦ శరణుఁజొచ్చి
మనుమనిన మాఱుపలుకక ♦ మహానమూని
కాఱుతనదేశ వీరర ♦ క్తమునుగలసి
యెఱ్ఱగాఁ బాఱుచుండెడు ♦ నేఱుఁజూపి
పొదినినుండిన కడపటి ♦ ములికిఁదీసి
యుఱముగుఱిచూచి పంపెఁ బ్రి ♦ త్యుత్తరముగ
నమలకీర్తిరతుండగు ♦ హైందవుఁడు
దేశసేవాధురంధర ♦ ధీయుతుండు.

## కిన్నరీవిజయము.

సరిగ నేసిన బాణమ్ముఁ ♦ గుఱికిఁదప్పఁ
బడియె వీరుండు క్రూరుండు ♦ బ్రిదికిపోయె;
నా ప్రదేశమ్ము కిన్నరి ♦ యాత్మనిలిపి
పోరుసందడి యంతయు ♦ ముగియఁగానె
యొక్క ప్రాభాతకిరణంబు ♦ నెక్కి డిగ్గి
స్వేచ్ఛతో జన్మమెత్తిన ♦ వీరవరుని
యాత్మ వెడలక పూర్వమే ♦ యామహాత్ము
నమలహృదయంబునందుండి ♦ యతులమహిమఁ
దొఱఁగు కడపటిరక్తబిం ♦ దువును గొనియె.

---

" స్వర్గమున వెల్గు నామహా ♦ ద్వారమందు
నర్పణము చేయ నెంతయు ♦ నర్హమైన
కానుక గానిది దప్పక ♦ క్రాలుఁగాక;
తఱచుగా రణభూమినిఁ ♦ దొఱఁగునట్టి
రక్తబిందులు నిందాక ♦ రములెయైన
రక్తి నిటు స్వేచ్ఛ కర్పించు ♦ రక్తమెన్న
నందనపుఁబువ్వుపొదరిండ్ల ♦ క్రిందమించు
పావనతరంగిణిని మైల ♦ పఱుపకుండు
నంతటిపవిత్రమై కడు ♦ నలరుచుండు;
భక్తితో స్వేచ్ఛదేవతా ♦ పతుమూని
రక్తమును ధారవోసెడు ♦ భక్తవరుని

హృదయమందుండి యాదేవి ♦ ప్రేమమీఱ
నంత్యతర్పణముగఁగొని ♦ హర్షమందు
నమలతరమైన యీయరు ♦ ణాంబుకణమె
యీశ్వరప్రీతికరమయి ♦ యొసఁగుచుండు
నన్నికార్యములమిన్నయై ♦ చెన్నుమీఱు".
అనుచు నెలుఁగెత్తిపలుకుచు ♦ నాత్మనలరి
యెగసిపోయెను గిన్నరి ♦ గగనమునకు.

---

తాను నీరీతిఁదెచ్చిన ♦ దానినంత
దివ్యతరముగ వెలిఁగెడు ♦ దేవదూత
చేతనిడఁగానె యతఁడు వీ ♦ క్షించి దానిఁ
బ్రాణమిటు దేశమునకు న ♦ ర్పణము సేయు
శౌర్యనిధులకు నొసఁగెడు ♦ స్వాగతంబు
ప్రీతికరమెంతయును మాకుఁ ♦ బ్రీతికరము ;
కానిచూడుము కిన్నరీ! ♦ కదలదయ్యె
స్వర్గనందన సుందర ♦ ద్వారమందు
బద్ధమయియుండు స్ఫటిక క ♦ వాటముకటు!
కాన నీరక్తబిందువు ♦ కంటెఁగూడఁ
గడుపవిత్రమ్ముగాఁ గాన్క ♦ గ్రాలవలయు
నీకు స్వర్గంపుఁదలుపులం ♦ దెఱచుటకును"
నంచుఁబలికెను గిన్నరి ♦ యాలకింప.

---

# కిన్నరీవిజయము.

స్వర్గమునుగాంతునికనని ♦ సంతసిలిన
యట్టి తొలియాశయిట్లు ని ♦ రాశగాఁగ
దక్షిణమ్మునదప్పులఁ ♦ దనరుచుండు
నాఫ్రికాలోని చంద్రాద్రు ♦ లందు వాలి,
ధరజనించిన నరుల నే ♦ త్రములఁబడక
గుట్టుగా గాఢవనములఁ ♦ బుట్టినట్టి
సొగసుగాఁ దనతొట్టెల ♦ చుట్టుమూఁగి
నీటివేల్పులు ప్రీతితో ♦ నృత్యమాడి
తన వినూతనమందస్మి ♦ తములఁగాంచి
భూరిసంతోషమును వెలిఁ ♦ బుచ్చునట్టి
మేటి 'యీజిప్టునైలు' పై ♦ న్నేటినీటఁ
దనదుగరులకుఁగిన్నరి ♦ నునుపుఁగొలిపె.

---

దివినివెలివేయఁబడిన యా ♦ దేవకన్య
మింటనటునుండి "యీజిప్టు" ♦ మీఁదవాలి
దానిఖర్జూరవనముల ♦ దానిగుహల
దానిరాజసమాధి సం ♦ తతులఁగాంచి
దీర్ఘనిశ్శ్వాసములఁబుచ్చి ♦ తిరుగఁజొచ్చె;
నంతవెచ్చని "రోసెటా" ♦ యనెడుకనుమ
మీఁదవ్రేలుచు నచ్చట ♦ మెలఁగుచుండు
గులు తెలుంగుల రంగుల ♦ పావురములు

లీలగావించురవముల ♦ నాలకించె;
నంతవరనీలనిర్మల ♦ కాంతియుతము
శాంతిమయము "మిరస్స"ను ♦ చారుసరము
గాంచి యాశాంతిరోదలఁ దో ♦ లంచుచుండు
వెల్లకొంగలగరులపై ♦ వెలుఁగుచుండు
తేటవెన్నెలకెలమిలోఁ ♦ దేలుచుండె;
దృశ్యమెంతయు రమ్యమై ♦ తేజరిల్లె;
నింతకంటెను నందమై ♦ యెసఁగుదానిఁ
గాంచియుండునెమర్త్యుఁడె ♦ కాలమునను ?

---

పండువెన్నెలలోఁబైడి ♦ పండ్లుపండెఁ;
గాయురేయెండనుబయళ్ళ ♦ గాచుకొనియెఁ;
జేరినిద్దురసూచింప ♦ శీర్షములను
బట్టుమెత్తలపైవాల్చు ♦ పడుచులట్లు
వనములనుబత్రిమకుటముల్ ♦ దనరుచుండు
తలలనొయ్యన ఖర్జూర ♦ తతులువంచెఁ;
బ్రియుఁడు సూర్యుండుమేల్కాను ♦ వేళకెల్లఁ
దాముక్రొత్తసి యందచం ♦ దములమీఱి
లేవరేయొల్ల సరసిలో ♦ లీలమెఱయుఁ
జెలఁగివెలిదమ్మిపువ్వులు ♦ జలకమాడె;
మంచికలగాంచి సంగతుల్ ♦ మఱచిపోవఁ

గొద్దిగాజ్ఞప్తియందున్న ♦ సుద్దులట్లు
పొలుపుదఱిగిన గుడులుగో ♦ పురములుండె.
దివ్యమైశాంతముగనుండె ♦ దృశ్యమెల్లఁ.

---

కూయుచుండెడు తీతువు ♦ కూఁతదప్ప
వినుటకెద్దియు లేదయ్యె ♦ వీనులకును;
వడివడినిసన్న మేఘమ్ము ♦ లెడలిపోయి
లీలతోఁజంద్రహాసముఁ ♦ గ్రాలఁజేయఁ
గరముమెఱసెడు విహగ ♦ విగ్రహముకరణి
మిన్నుముట్టెడుకంబము ♦ మీఁదికొనను
గొంచెమేనియుఁ గదలక ♦ కూరుచుండి
యింద్రనీలపుఁగాంతుల ♦ నీనుచుండు
పక్షములనొప్పు "సుల్తాన" ♦ పక్షిదప్పఁ
గాంచనెవ్వరులేరైరి ♦ కన్నులకును.

---

ఇట్లుశాంతముఁగాంతమై ♦ యొసఁగునచట
ఘోరమగుమంటగ్రక్కునె ♦ డారియైన
వీచియెఱుఁగనిక్రూరమౌ ♦ వేఁడిగాలి
భీకరమ్మగునా "మారి" (Plague) ♦ వీచునంచుఁ
జూచునెవ్వనికైనను ♦ దోఁచియున్నె?
దానిగరిగాలిసోఁకిన ♦ తత్క్షణమున
మానవాకృతినున్నయే ♦ ప్రాణిగాని

వేఁడి "సైమూము"గాలికి ♦ వృక్షతతులు
మాడిపడునట్లు మలమల ♦ మాడిపడును ;
భవ్యదశనున్న యెందఱో ♦ పడుచువారి
ఫాలమునఁగాంతిఁజల్లుచు ♦ భానుఁడరిగె;
వారలేయిప్పుడా ఘోర ♦ మారిబారిఁ
జిక్కికుళ్ళిరికుటిఁబడి ♦ యక్కటకట!
యనుభవింపరు వారింక ♦ నర్క్కసుఖము.

ఖననసంస్కారమును బొంద ♦ ననువులేక
నిండువెన్నెలదమపఘు ♦ నిద్రపోవఁ
బుడమిపైరాసులుగ రాలి ♦ పడినయట్టి
శవములనుజూడమదికి వి ♦ షాదమొదవు;
ఈచెడినకూటి కెంతయు ♦ సేవగించి
పెడముఖము వెట్టిగ్రద్దలుఁ ♦ వెడలిపోవు ;

పాడుపడినట్టి పత్తన ♦ పథములందు
భయముఁగొల్పుచుఁగ్రొవ్వి సి ♦ వంగియొక కొ
మెరను వెదకుచునడు రేయిఁ ♦ దిరుగుచుండు;
కటికచీకఁటిపడ్డ మా ♦ ర్గమ్మునందు
దీనిసిలవిశాలాగ్ని ♦ దృష్టికకట!
చావుబ్రదుకుల నడుమను ♦ దేవులాడు
నెక్కదురదృష్టుఁడెవడైనఁ ♦ జిక్కెనేని
వానిదుర్దశనింకఁజె ♦ ప్పంగఁదరమె!

అపుడుకిన్నరి ఘోర ♦ దృశ్యమునుగాంచి
"అకట! మానవజాతి! నీ ♦ వటులుతొలుత
సురవనమునుండి జాఱిన ♦ దురితమానవు
నచ్చుకొంటివిదండుగ ♦ లధికములుగ.
స్వర్గనందన కుసుమాళి ♦ సౌరభమ్ము
వదలకింకను నీలోనఁ ♦ బొదలుచుండెఁ;
గానిమాయాహిజాడలున్ ♦ మానకుండె"
ననుచుఁగరుణాశ్రువులు దన ♦ కనులనించె;
నరునికైజాలిగొనియిట్లు ♦ సురలువగవ
బొడమునొక్కొక్క కన్నీటి ♦ బొట్టుగూడ
నద్భుతంబగుశక్తిచే ♦ నలరుఁగాన
వెలుఁగుకన్నీరు కిన్నరి ♦ విడుచుచుండఁ
జుట్టుగాలియు శుభ్రమై ♦ శోభఁగాంచె.

---

నింగిపైనుండి కిన్నరి ♦ తొంగిచూడఁ
జెలువుమీఱిన నారింజ ♦ చెట్లుకొన్ని
గానవచ్చెను వానిలోఁ ♦ గ్రాలుచున్న
ఫలములును బూలుగాలిచేఁ ♦ గలసిమెలసి
ప్రీతివృద్ధులుగడుఁ బసి ♦ పిల్లవారు
గూడిక్రీడించుచున్నట్లు ♦ కొమరుమిగిలెఁ;
పూచిపొల్చెడు నాకొత్త ♦ పొదరుక్రిందఁ

దనరుచుండుసరోవర ♦ తటమునందు
శబ్దమింతయులేని యా ♦ సమయమందు
నింటికడనుండి యెవ్వరి ♦ కంటఁబడక
యేకతంబుగ మృతిచెంద ♦ నేగుదెంచి
వనరునొకరోగి మూలుగు ♦ వినఁగవచ్చె;
సుఖగనున్నప్పుడేగిన ♦ చోటనెల్ల
నెందఱకొ ప్రేమపాత్రుఁడై ♦ యెసఁగియిపుడు
పరిచితుండొక్కఁడును లేని ♦ వానివలెను
వగచువారేని చూచెడు ♦ వారలేని
నొక్కరును లేక మరణించు ♦ చున్నవాఁడు;
కాచియుంటకుఁగూడ నె ♦ క్కఁడును లేఁడు;
ఎదుటఁగంటికిఁ జల్లగా ♦ నెసఁగుచుండు
సరములోనుండి పుడిసెడు ♦ జలముదెచ్చి
హృదయమందలి దగఁదీర్ప ♦ నెవఁడు లేఁడు;
అన్నిశబ్దములడఁగిన ♦ యపుడుగూడ
దూరగానము గతివినఁ ♦ దోఁచుచుండి
సర్వమును దీఱిపోయిన ♦ సమయమందుఁ
గుటిలసంసారసాగర ♦ తటముఁజేరి
ప్రజ్ఞకందనియాతమో ♦ రాశియందు
నాత్మదనతెప్పఁదోసెడు ♦ నవసరమున
బలినిగొల్పెడు చిన్నిపి ♦ ట్టొక్కలుపనంగ

నొప్పకడపటి మాటను ♦ జెప్పుటకును
జిరమెఱింగినవారైనఁ ♦ జెంత లేరు!

---

అట్లుదిక్కుఁజూచి యుద్దిశ ♦ నాతఁడున్నఁ
దడవులనెఱింగిపలచియు ♦ దనకునింకఁ
దనదియనిచెప్పుటకుఁగాని ♦ తలిరుఁబోఁడి
జనకునివిశాల భవనరా ♦ జమ్మునందుఁ
దన్నిటలమంటిసేవించు ♦ సన్నగాలి
సాటియాఁబోటి కనదగు ♦ తేటగాలి
చల్లుమఱుబుగ్గ చిమ్మెడు ♦ చల్లగాలి
హిందువుల సీమఁబుట్టిన ♦ చందనంపు
గందపుఁబొగల్ బుగుల్కొను ♦ కమ్మగాలి
హాయిగావీవ నీనడు ♦ రేయివిసుచు
చెడ్డగాలికిదూరమై ♦ సేమముగను
నున్నదనుదలఁపొక్కటే ♦ యుల్లమందు
సంతసమ్మునుగొల్పె నా ♦ చావనున్న
పడుచువాఁడగు నావ్యాధి ♦ బాధితునకు.

---

కానిచూడుమదెవతెయో ♦ కానియదిగో!
యొంటరిగనెవరికేనియుఁ ♦ గంటఁబడక
పిల్లువగఁజల్లు నీపొద ♦ రిల్లునెదక

నమ్మహారోగ్యదేవత ♦ యంపినట్టి
యలరుప్రాయంపు మాతయో ♦ యనఁగవచ్చెఁ;
జెక్కుట గులాబి కాన్కలఁ జేర్చి తెచ్చె;

---

దవులనున్నను వెన్నెల ♦ దఱిగియున్నఁ
దన్వియెవతెయొ యిప్పుడా ♦ తనికిఁదెలిసెఁ;
దానుబెండ్లాడనుండిన ♦ ధర్మరతయె!
అతనితోఁ దానుమరణించి ♦ యరుగుఁగాని
వసుధనన్యసుఖాళికై ♦ బ్రదికియున్నె?
కన్యయదెవచ్చి ప్రియునిదాఁ ♦ గౌఁగిలించె;
అతని నల్లనిచెక్కిలి ♦ యతివమిన్న
తనదుచెక్కిలి పైఁబెట్టి ♦ తలఁచునెత్తె;
నొచ్చిమండెడు నాతని ♦ నుదుటఁగట్టు
పీడివ్రేలాడు తనముడి ♦ వెండ్రుకలను
నిండుకొనేటి చల్లని ♦ నీటముంచె;
నందనోద్యానమందునా ♦ నందముగను
నూఁగిసురబాల బాలికల్ ♦ దూఁగుచుండు
నెలవుమాడ్కిఁ బవిత్రమై ♦ చెలఁగినట్టి
తత్సతీమణికౌఁగిలి ♦ తనకునిట్లు
భయముఁగొల్పెడు సమయమ్ము ♦ వచ్చునంచు
నెన్నఁడే నతఁడకటా! ♦ యెంచియున్నె?

ఒగ్గెనొకపారి యొకపారి ♦ యువిదమోవి
యందె విషమెల్ల నుండెనే ♦ నపుడు దాను
వెఱచునట్టులు వెఱచుచు ♦ విముఖుఁడయ్యె;
అంతవఱకెన్నఁడును గాని ♦ యతనికొఱకు
నడుగఁబడకుండ మఱిసిగ్గు ♦ పడకయుండ
ముద్దునిచ్చి యెఱుంగని ♦ ముగ్ధ నేఁడు
నిర్భయమ్ముగ ముద్దిడె ♦ నిండుమదిని.

---

అంతఁ బెడమోము వెట్టిన ♦ కాంతఁ జూచి
"నీవు వెలిఁబుచ్చుగాలి పు ♦ న్నెంపుగాలి
పీల్వగానిమ్ము నాథ నన్ ♦ బీల్వనిమ్ము;
దానిఁజెక్కులనున్న దే ♦ దైనఁగాని
మించు నారోగ్యమే గాని ♦ మృతియె గాని
ప్రీతికరమది నాకు సం ♦ ప్రీతికరము;
ధారగాఁగాఱు కన్నీరు ♦ ద్రావుమిదిగో;
నాహృదయరక్తమందు సం ♦ తాపమార్చు
నుత్తమంబైన మహిమయే ♦ యుండియున్న
నుదుటనిముసమ్ము శాంతి నీ ♦ కొదవుటకును
బ్రీతి నా రక్తమెల్ల న ♦ ర్పించియుందు;
అవలఁద్రిప్పకు నీప్రియ ♦ మైనమోము;
దయిత! యిటుచూడు నేను నీ ♦ దాననఁగానె?

బ్రదుకుచావులయందు నీ ♦ ప్రక్కనుండ
నెన్నికొనినీవు వలచిన ♦ కన్నెగానె?
అంధకారపరీవృత ♦ మైనభువిని
వెలుఁగు నీనుండియే కాంచి ♦ వెలిఁగినేను
నీవ్వోయినతరువాత ♦ నిలిచియుండు
నుగ్రతరదీర్ఘరాత్రిని ♦ నోర్వఁగలనె?
ప్రాణమేనీవు నినువీడి ♦ బ్రదుకఁగలనె?
బ్రదుకజాలను నిజముగా ♦ బ్రదుకఁజాల;
ఆకుదొడిగిన కాడవా ♦ నంతరింప
నంతమైతీయుఁ గాడతో ♦ నాకుగాన
వాడిమండుచు నుండు నీ ♦ వలెనెనేను
వాడిమండక మున్నె నా ♦ వంకఁదిరుగు;
తిరుగు మత్ప్రేమధామమా! ♦ తిరుగుతిరుగు;
వదలకింకను జల్లగాఁ ♦ బొదలుచుండు
పెదవులకుఁ దుదిమెదలెడు ♦ విమలమైన
కొట్టకొనయూపిరిని బాలు ♦ గొనుముగొనుము
గొనుమనుచుఁ జేష్టలుడిగియా ♦ కొమ్మక్రుంగె;
గోతిలోగాలి లేకయో ♦ గుహాలయందు
నధికశైత్యమ్మునను దీప ♦ మాఱుగతిని
నార్తునాతనియూర్పులఁ ♦ హాతులచేత
నలివకన్నుల కళలెల్ల ♦ నాఱిపోయె;

నంతనొకపారి మృతిబాధ ♦ ననుభవించి
వేదనలనెల్ల నాతఁడు ♦ పీడిచనియె;
ప్రియుఁడు జీవింపకిట్టులు ♦ విడిచిపోవ
ముద్దిడియెఁగన్య కడపటి ♦ ముద్దునిడియె;
తెగనియాముద్దు నిడుచునే ♦ తీఱిపోయె.

---

అంతఁగిన్నరి యాకన్య ♦ కాత్మమెచ్చి
యెంతవిశ్వాసమును మఱి ♦ యెంతభక్తి
కాంతల హృదంతరమ్ములఁ ♦ గాయఁగలదొ
యంతయునుజూపి యవ్విధి ♦ నస్తమిలిన
చానకొనయూర్పుఁ దిన్నగా ♦ సంగ్రహించె.

---

నంతనటనున్న కన్నెకా ♦ యమునుజూచి
"స్వయముగా మృత్యుగీతము ♦ పాడుకొనుచు
నెంతయును వింతగొల్పనే ♦ కాంతమందు
గాన సౌరభములయందుఁ ♦ గడచిచనెడు
వేలుపుంబిట్ట చిలికంటె ♦ విమలమైన
శీతవాతసుగంధ సం ♦ పూతమైన
సుఖసమ్మాధిని నిద్రింపు ♦ శుభచరిత్రి"
యనుచుదీవించి పెదవుల ♦ యందునుండి
యాస్థలంబున దివ్యమా ♦ ననిలమూఁది

నిండుమెఱుఁగులఁ జెలఁగెడు ♦ దండమూఁచె;
వారలిర్వురు దమవెలి ♦ వదనములను
దానికాంతులుపడి తళ ♦ తళలనీనఁ
గమ్మతావియుఁ జీఁకటి ♦ గ్రమ్మియుండు
నిజసమాధులలో దీర్ఘ ♦ నిద్రనుండి
ప్రళయమునఁ బైకిదీయంగఁ ♦ బడినయట్టి
యిరువురు మహాత్ములోయన ♦ నెసఁగిరపుడు;
వారియాత్మలు మేల్కాను ♦ వఱకుమీఁద
శాంతముగఁ గాచియుండెడు ♦ స్వర్గదూత
యనఁగ నాకిన్నరీమణి ♦ తనరుచుండె.

---

అంబరంబున నుదయరా ♦ గంబువొడమె;
త్యాగపూరిత విమలాను ♦ రాగమిడిన
యాయమూల్యంపుటుచ్ఛ్వాస ♦ మందిమరల
దేవునకొసంగఁ గిన్నరి ♦ దివికినెగసె;
కాన్కనిడఁగానె వాకిటఁ ♦ గాచియున్న
దివ్యపురుషుండు నవ్వెను ♦ దీనిఁబట్టి
యమరవనమింకఁ ద్వారలోనె ♦ యమరునంచుఁ
బొదలికిన్నరి హృదయము ♦ పొంగఁజొచ్చె;
అమ్మహాప్రభు సింహాస ♦ నమ్మునుండి
వీచునమృతంపుగాలికి ♦ వేల్పుదోఁట

వెలుఁగుపటికంపు గంటల ♦ వెలయుతరులు
చేయురవములు కిన్నరి ♦ చెవులయందుఁ
బర్వముగనప్పుడే వినఁ ♦ బడఁదొడంగె;
మొదట స్వర్గప్రవిష్టులు ♦ గదిసితటిని
మధురజలపాన మొనరించి ♦ మహిమఁగాంచు
నిర్మలసరోవరము చుట్టు ♦ నెగడుచుండు
తరళనక్షత్రపాత్రముల్ ♦ తళతళమని
కానవచ్చెను గిన్నరి ♦ కన్నులకును.

---

అకట! పాపము! కిన్నరి ♦ యాశలెల్ల
నిప్పుడునుగూడఁ బండక ♦ తప్పిపోయె;
మాయమరదృష్ట మడ్డమై ♦ మరలవచ్చె;
పుణ్యలోకంపుఁ దలుపులు ♦ మూయఁబడియె;
జయము సూచనలావేల్పు ♦ చాననుండి
మాయునప్పుడు చింతిల్లు ♦ చాయదోఁప
నాసురలదూత కిన్నరి ♦ కేసిచూచి
"ఆఁగుమింకను గిన్నరీ! ♦ యాఁగుమాఁగు;
సత్యవతి కన్య ధన్యసం ♦ శయము లేదు;
మించు పరమేశుమాళిని ♦ మెఱుపుచేత
వ్రాయఁబడినట్టి యాసతి ♦ భవ్యచరిత
చిరముచదువంగఁ బడుచుండు ♦ సురలచేతఁ;

గాని చూడుముకిన్నరీ! ♦ కదలదయ్యొ
స్వర్గనందన సుందర ♦ ద్వారమందు
బద్ధమయియుండు స్ఫటికక ♦ వాటమకట!
కాన నీకన్నెయూపిరి ♦ కంటెఁగూడఁ
గడుపవిత్రమ్ముగాఁ గాన్క ♦ గ్రాలవలయు
నీకుస్వర్గమ్ము దలుపులం ♦ దెఱచుటకును"
అనుచు వచియించెఁ గిన్నరి ♦ యాలకించె.

---

చెలఁగెడి గులాబిపువ్వుల ♦ సిరుల వెలయు
'సిరియ' యనుపేరఁబరఁగిన ♦ సీమమీఁద
వింతగా సంజవెలుఁగుచు ♦ విశ్రమించె;
వర'లిబానను' గిరిముని ♦ ప్రవరుమీఁదఁ
దత్ప్రభామండలంబనఁ ♦ దరణి వ్రేలె;
శీతకాలము వైభవో ♦ పేతమగుచు
నెప్పుడును వెలిమంచుచే ♦ నొప్పుచుండు
నున్నతాచలశిరముపైఁ ♦ జెన్ను మీఱె;
వేసవిగులాబిపూలచే ♦ వెలయుచుండు
వనముతో నదిప్రపదములఁ ♦ బవ్వళించె.
నింగిపైనుండి క్రిందికిఁ ♦ దొంగిచూచు
వారికాభవ్య సీమపై ♦ వఱలుచుండు
పలుతెఱంగుల కాంతులు ♦ చలనములును

నెంతవింతను గొలుపునో ♦ యెఱుఁగఁదరమె?
మంచితోఁటలు తెలిసేట ♦ మించునదులు;
పేనిగట్టుల విరివిగాఁ ♦ బెరుగుచుండి
వివిధపరిమాణములచేత ♦ వెలయుచుండి
పైడివలెమించి యెండలోఁ ♦ బైడిమించి
పొలుచుచుండెను వింతఁగ ♦ ర్బూజపంక్తు,
పాదుపడియుండునట్టి దే ♦ వాలయముల
గోడలను గాంతితతులు పా ♦ ఱాడునట్లు
వడివడిగఁ బ్రాకుచుండెను ♦ బల్లిగములు,
గనులఁబుట్టిన ఘనమణి ♦ గణముతోను
సొగసుగుల్కెడు కిన్నర ♦ నగరమందు
మొగిలిపుట్టని నింగిని ♦ బొదలుచుండు
జలమెఱుఁగని సురచాప ♦ చయముతోను
బెడఁగుమీఱంగఁ బొదుగంగఁ ♦ బడినయట్లు
భవ్యమగు సంజకెంజాయ ♦ పడివెలుంగు
పక్షములతోడ నటునిటు ♦ వాలుచుండి
గుట్టగట్టుల నిలయముల్ ♦ గట్టుకొన్న
పలు తెఱంగుల గుంపుల ♦ పావురములు,
అలరుఁదోఁటలయందు విం ♦ దారగించి
విమలపాలిస్థలీవన ♦ వీధులందు
భృంగములు చేయుచుండు ఝుం ♦ కృతులతోడ

గోపకుల వేణునాదము ♦ గూడఁగలసి
వచ్చి చెవిఁబడుచుండెను ♦ వరరవములు,
కోకిలాపూర్ణవనములఁ ♦ గొమరుమిగులు
దివ్య 'జార్డన్' తరంగిణీ ♦ భవ్యతటులు,
నిన్నియుండియుఁ బాపమా! ♦ కిన్నరికిని
నెక్కడైననుసంతోష ♦ మొసఁగదయ్యె;
వగపుమదినిండె; ఱెక్కలు ♦ బడలియుండె;

---

కాలమనుమాంత్రికుఁడు దన ♦ కాలమెల్లఁ
గొలువఁగా భూమిమీఁదను ♦ నిక్షిపినట్టి
కంబములనంగ నీడలఁ ♦ గడలకిడుచు
విజనసీమను నెత్తుగా ♦ వెలయుచున్న
కంబములె నిల్చి మున్నెక్క ♦ కాలమందుఁ
దాను వెలసిన ధామమై ♦ తనరుచున్న
దేవళముమీఁదఁ దిన్నగా ♦ దృష్టిపఱుపు
-చున్న రవిగాంచెఁ గిన్నరి ♦ ఖిన్నయగుచు.

---

అమ్మహాసూర్యదేవాల ♦ యమ్ము క్రింద
దాపఁబడినట్టి రత్నముల్ ♦ దాపినట్టి
రక్షయే కాని, దివ్యాగ్ని ♦ రక్షగాంచి

"సాలమను"గొప్పనామము ♦ గ్రాలుచున్న
నేక యేకాని తనదివ్య ♦ దృష్టికబ్బి,
వడిగనీదోషినాత్మను ♦ స్వర్గమునకు
మరలఁజేర్చెడు కాన్క చం ♦ దురినిక్రింది
భువిఁగలదొ లేక సాగర ♦ మునను గలదొ
తెలుపఁగలదేమొ? దుఃఖమ్ము ♦ తొలఁగునేమొ?

---

అనెడునాశ జనించిన ♦ హర్షమంది
యచటవాలెను గిన్నరి ♦ యనిలపుత్రి
గగనలోచనుఁడింకను ♦ నగుచునుండె;
పడమటను సంజపొదరిండ్ల ♦ పైఁడికాంతి
తఱుగకుండెను గొంచెముఁ ♦ దఱుగకుండె;
నపుడు "బాల్బెక్కు"వనముపై ♦ నమరకన్య
నింగిపైనుండి మెల్లగాఁ ♦ దొంగిచూచె.

---

అచ్చట గులాబితోఁటలో ♦ నాటఁబాటఁ
బొదలునెక్కుడు బాలుఁడా ♦ పూలవంటి
రంగుతోడను స్వేచ్ఛతోఁ ♦ గ్రాలువాఁడు
వేడ్కపడు చూపుచేతుల ♦ వెలయువాఁడు
నెగయురత్నాలొ! చెక్కుల ♦ నెగడుపూలొ!

యనఁగనొప్పారిమల్లెచె ♦ ట్టునకుఁజుట్టుఁ
దిరుగునాయూకుచిల్కల ♦ తెగలుఁగోడఁ
బట్టువిడునాటలాడుచు ♦ బడలిబడలి
విశ్రమించెను వని గులా ♦ బీలనడుమ;
అంతబాలునిచెంగట ♦ నలసివచ్చి
నిండుగఁజెమర్పుగుట్టంబు ♦ నుండిడిగ్గి
యొక్కపురుషుఁడుదప్పితోఁ ♦ బ్రక్కనుండు
చిన్నసత్రంపునూతికిఁ ♦ జెంతనిలిచె;
నిలిచిదాపుననెంతయు ♦ నిర్భయముగ
వేడ్కఁగూర్చున్నచక్కని ♦ పిల్లవాని
ప్రక్కకుందిరిప్పెఁదనవికా ♦ రపుముఖమ్ము;
అంతకంటెనుభీకర ♦ మైన నుదుటఁ
గిరణములఁగొల్పియెఱుఁగడు ♦ తరణియెపుడు;
అతిభయంకరమైన యా ♦ యాననమున
మేఘమున ధూమనహ్నులు ♦ మిళితమైన
కరణిఁదెగువయుఁగోపముఁ ♦ గలసియుండె;
అతిభయంకరకృత్యమ్ము ♦ లాచరించి
నట్టికథలెన్నియో వాని ♦ యాస్యమందుఁ
జక్కఁగాఁగిన్నరీమణి ♦ చదువఁగలిగె ;
పడుచులెందఱునోపాడు ♦ పఱచియుండె,
పావనక్షేత్రములమైల ♦ పఱచియుండె,

సలిపినప్రమాణములమంటఁ ♦ గలపియుండె,
అతిథిరక్తమ్ముచేత గృ ♦ హమ్మునకును
జెఱుపఁగాని కళంకముల్ ♦ జేర్చియుండె;
కరుణ కన్నీట పీనిని ♦ జెఱుచువఱకుఁ
జెడక యుండెడునట్టులా ♦ చిత్రగుప్తుఁ
డలుక చేమండి తనవడి ♦ కలమునుండి
కాఱుమసిబొట్లవ్రాసిన ♦ కరణిదోఁప
హాని నొసటని వెల్లఁగ ♦ న్పట్టుచుండె.

---

శాంతమును గొల్చుచుండెడు ♦ సంజచేత
నాత్మమృదువయ్యెనోయన ♦ నాదురాత్ముఁ
డపుడు నెమ్మదిగానుండి ♦ యాగులాబి
నెనయుబాలుని యాటలఁ ♦ గనుచునుండె;
అతని కెంజూపులా బాలు ♦ నమలమైన
యలరుఁజూపును గలసిన ♦ యపుడుచూడ
భోగములరాత్రిమండిన ♦ కాగడాలు
బాలరవికాంతిఁగలసిన ♦ పగిదినుండె.

---

గగనమణిగుర్రంకఁ గ్రిందికి ♦ దిగినకొలఁది
వింతగాఁసిరియాలోని ♦ వేన వేలు
శిఖరములనుండి ప్రార్థన ♦ సేయఁగొలుపు

ప్రియరవమ్మంతకంత వ ♦ ర్ధిలఁగఁజొచ్చెఁ;
పొల్చుపూసెజ్జపైఁదల ♦ వాల్చియున్న
బాలుఁడప్పుడులేచి యా ♦ పరిమళించు
భూమిపై దక్షిణపుదిశ ♦ మోకరించి
నిటలమునుసంచి పరమేశు ♦ నిత్యునభవుఁ
జెన్నుమీఱెడు విమలంపుఁ ♦ జిన్నినోట
వచ్చియునురానిమాటల ♦ నుచ్చరించి
యచటియాపుష్పవనమున ♦ నప్పుడపుడె
జాటితసమందిరముమఱిఁ ♦ జేరఁగోరు
దేవశిశువో యనంగను ♦ దివమునకును
గరములను గన్నులను నెత్తి ♦ కాంచుచుండె.
ఏమిశిశువేమిదృశ్యమ ♦ దేమి దినము!
ఒప్పుచూడంగవలెఁగాని ♦ చెప్పఁదరమె!
ఎంతగర్వించు పూర్వదే ♦ వేంద్రునైనఁ
జన్న తనశాంతిమహిమల ♦ నెన్నుకొనుచు
నొక్కనిట్టూర్పునిడఁజేయ ♦ నోపునన్న
నింకసటనిల్చి దని పే ♦ క్షించుచున్న
యద్భుతాత్ముని మదిలోని ♦ వ్యాకులమును
జెప్పఁదరమానె యెవరికేఁ ♦ జెప్పనగునె?

---

అంతమదమెల్లఁబోయియా ♦ యాతతాయి
ప్రళయమందలి ఘోరప్ర ♦ వాహమట్టు
లెన్ని యోయేండ్లు క్రూరంపు ♦ కృత్యములను
జనిన తనజీవితముపయి ♦ మనముఁగొలిపి
యెంత వెదకిన బుద్ధికి ♦ నెచటఁగాని
కానరాదయ్యె విశ్రమ ♦ స్థానమేని
శాంతిసూచకమగునొక్క ♦ శాఖయేని;
గానఁగడుగ్రుంగి యాపిల్ల ♦ వానిఁజూచి
"పున్నెములపంటవైన యో ♦ చిన్నియన్న!
నీవలెనెచిన్ననాఁడు నే ♦ నిర్మలముగ
నున్న యప్పుడునీవలెఁ ♦ గన్ను లెత్తి
మింటఁజూచుచుఁబ్రార్థించు ♦ చుంటిఁగాని
యిప్పుడో" యనితలవంచి ♦ యేమియనక
చిన్నతనముననుండియుఁ ♦ జిత్తమందు
నించుకయు మేలుకోనక ని ♦ ద్రించుచున్న
యుత్తమములగు లక్ష్యముల్ ♦ యోగ్యములగు
కోరికలు భావములవెల్లఁ ♦ గ్రొత్తలాచు
నొక్కపారిగఁదలలెత్త ♦ వెక్కి వెక్కి
యేడ్వఁజొచ్చెనువిలవిల ♦ యేడ్వఁజొచ్చె;

అపుడుకిన్నరి విలపించు ♦ నతనిఁజూచి
"గాఢముగఁజొచ్చి హృదయముఁ ♦ గాల్చి కాల్చి
వెలికివచ్చినపరితాప ♦ మొలుకునిట్టి
యశ్రుబిందువె ధన్యమై ♦ యలరుచుండు;
పాపమోచనకరుణాప్ర ♦ వాహమైన
దీననేపాపి తొలుదొల్త ♦ మానసమున
నిర్మలానందరూపముఁ ♦ దెలియుచుండు;
వేసవినిమండుచుండెడు ♦ వేఁడిగాలి
నుండి "యీజిప్టు" మీఁదఁ జం ♦ ద్రుండు రాల్చు
నఖిలరోగనివారితా ♦ పాపహారి
యైనయొకబిందువే యెట్టు ♦ లద్భుతముగ
రోగములనార్చి నిండు నా ♦ రోగ్యమిచ్చి
ధరకుఁదివికిని మరలఁ జై ♦ తన్యమొసఁగు
నట్టులేసుమ్ము పరితాప ♦ మాత్మఁగలుగఁ
గాఱునుత్కృష్టమైన క ♦ న్నీరుగూడ!
పతితుఁడా! చూడునీమదిఁ ♦ బ్రబలియున్న
పాపరోగములెల్ల నే ♦ పాటివైన
నొక్కదివిచుక్క యన్నింటి ♦ నుక్కడంచె"
ననుచుఁ దనడెందమునఁదానె ♦ యనుకొనియెను.

వినయముగఁ బ్రార్థనముసల్పఁ ♦ బిల్లవాని
పక్ష్రికన్నేపాపి మోకాళ్ళ ♦ వంచినిలిచె;
దోషిమీఁదను మఱియు ని ♦ ర్దోషిమీఁద
మించియొకసూర్యరశ్మియే ♦ మెఱయఁదొడఁగె;
పాపియొక్కఁడు క్షమియింపఁ ♦ బడియెననుచు
స్వర్గమంతట ఘోషించి ♦ ప్రకటపఱచు
హర్షగీతమ్ములను బాడి ♦ రమరులెల్ల.

---

పైఁడిగుండుగ నొప్పునా ♦ భాస్కరుండు
మింటనప్పుడె దానస్త ♦ మించియుండ
వారలింకను మోకాళ్ళ ♦ వంచియుండఁ
బాపములకట్లు పరితాప ♦ పడెడునతని
వెచ్చగానున్న మిక్కిలి ♦ విన్ననైన
చెక్కిలిని మంచువలెఁజల్ల ♦ చేయుచున్న
యశ్రుబిందువు మీఁదికి ♦ నట్టెరాలెఁ
దరణితారలలోనుండి ♦ ధరణికెపుడు
రాలియొఱుఁగని వింతయా ♦ రమ్యకాంతి;
ఉత్తరపుమించుగానొ, యే ♦ యుల్కగానొ
చూచుమర్త్యుల కిదిమదిఁ ♦ దోఁచవచ్చుఁ;
గాని జయసూచకంబయి ♦ క్రాలుచుండు
నశ్రువునుగాంచి యెంతయు ♦ నాత్మమెచ్చి

స్వర్గనందనసుందర ♦ ద్వారమందుఁ
గావలిగనున్న విఖ్యాత ♦ దేవదూత
వెలికిఁజిమ్మిన చిఱునవ్వు ♦ వెలుఁగటంచుఁ
దెలిసికొని కిన్నరీమణి ♦ యలరెమదిని.

---

"నందనంబబ్బె శాశ్వతా ♦ నందమబ్బెఁ;
దీఱెనాపని తలుపులు ♦ దెఱవఁబడియె;
సుఖినినేఁగానె? నిజముగాఁ ♦ సుఖినినేనె!
శ్రీలఁజెన్నారు కిన్నర ♦ సీమయందుఁ
గొమరుమిగిలెడు వజ్రింపు ♦ గోపురములు,
నెగడుచుండెను కిన్నర ♦ నగరమందు
నెంతయును బొల్చు పూఁపొద ♦ రిండ్లగములు,
సుందరస్వర్గవనమ! నీ ♦ ముందవెల్లఁ
జెప్పవలయునె కళలెల్లఁ ♦ దప్పియుండు;
మాఱి నశియించు ప్రియుని ని ♦ ట్టూరుపట్టు
లుండు నిహసౌరభములార! ♦ పొందుపొందు,
నిత్యజీవనసౌరభ ♦ నిలయమైన
పారిజాతమ్మె నాకింకఁ ♦ బారణమ్మె;
ధరణినాచేతనున్నయీ ♦ దండమందు
నుంతయిటువెల్గినశియించు ♦ సుమములార!
దండమిదెగొందు మీయంద ♦ నుండఁబొందు;

దళదళమున నందుఁ బ్రాణమ్ము ♦ దనరుపూల
కిమ్మగుచు స్వామిసింహాస ♦ నమ్ముచెంత
సంతతముపూచు కల్పభూ ♦ జమ్ముముందు
నెంత వెలఁగెడు పూవైన ♦ నేమిఫలము!
నందనంబబ్బె శాశ్వతా ♦ నందమబ్బెఁ;
దీక్షనాపని తలుపులు ♦ దెఱవఁబడియె;"
నచుఁగిన్నరి నందన ♦ మునకు నెగసె.

ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత లలితకవితా
కలిత శ్రీరామలక్ష్మాంబా బుచ్చివేంకయా
మాత్యతనూజాత సకల సజ్జనవిధేయ
ఆదిపూడి సోమనాథ నామధేయ
ప్రణీతంబైన కిన్నరీవిజయమను
కావ్యరత్నము.

సమాప్తము.



# సర్వమాన్యశతకము

భక్తిరసపూరితములై సర్వజన మనోరంజకములగు

100 సీసపద్యములు వెల 0-4-0.

# భక్తకర్ణామృతము

భక్తజన హృదయాహ్లాదకరములైన 40 కీర్తనలు

వెల 0-4-0.

# కిన్నరీవిజయము

మిక్కిలి యుత్కృష్టమైన కావ్యరత్నము అందఱుంజదువ

దగినది వెల 0-12-0.



వలయువారు :—ఈక్రిందివారికి వ్రాసిన వి. పి. గాఁ బడయఁగలరు.

ఆ. సోమనాథశాస్త్రి,

పిఠాపురము, గోదావరిజిల్లా.

# PARADISE AND THE PERI.

BY THOMAS MOORE.

One morn a Peri at the gate
Of Eden stood disconsolate;
And as she listened to the Springs
  Of Life within like music flowing
And caught the light upon her wings
  Thro' the half-open portal glowing,
She wept to think her recreant race
Should e'er have lost that glorious place!

" How happy," exclaimed this child of air,
" Are the holy Spirits who wander there
  'Mid flowers that never shall fade or fall;
Tho' mine are the gardens of the earth and sea
And the stars themselves have flowers for me,
  One blossom of heaven outblooms them all!

" Tho' sunny the Lake of cool CASHMERE
With its plane-tree Isle reflected clear,
  And sweetly the founts of that Valley fall;
Tho' bright are the waters of SING-SU-HAY
And the golden floods that thitherward stray
Yet—oh, 'tis only the Blest can say
  How the waters of Heaven outshine them all!

" Go, wing thy flight from star to star,
From world to luminous world as far
  As the universe spreads its flaming wall:

Take all the pleasures of all the spheres
And multiply each thro' endless years
One minute of Heaven is worth them all !"

The glorious Angel who was keeping
The gates of Light beheld her weeping,
And as he nearer drew and lisened
To her sad song, a teardrop glistened
Within his eyelids, like the spray
From Eden's fountain when it lies
On the blue flower which—Brahmins say—
Blooms nowhere but in Paradise.

" Nymph of a fair but erring line !"
Gently he said—" One hope is thine.
"' Tis written in the book of Fate,
*The Peri yet may be forgiven*
*Who brings to this Eternal gate*
*The Gift that is most dear to Heaven* !
Go seek it and redeem thy sin—
'Tis sweet to let the Pardoned in."

Rapidly as comets run
To the embraces of the Sun;—
Fleeter than the starry brands
Flung at night from angel hands
At those dark and daring sprites
Who would climb the empyreal heights,
Down the blue vault the PERI flies,
And lighted earthward by a glance
That just then broke from morning's eyes,
Hung hovering o'er our world's expanse;

But whither shall the Spirit go
To find this gift for Heaven ?—"I know
The wealth," she cries, " of every urn
In which unnumbered rubies burn
Beneath the pillars of CHILMINAR;
I know where the Isles of Perfume are
Many a fathom down in the sea,
To the south of sun-bright ARABY;
I know too where the Genii hid
The jeweled cup of their King JAMSHID.
With Life's elixir sparkling high—
But gifts like these are not for the sky.
Where was there ever a gem that shone
Like the steps of ALLA's wonderful Throne?
And the Drops of Life—oh ! what would they be
In the boundless Deep of Eternity?"

While thus she mused her pinions fanned
The air ot that sweet Indian land
Whose air is balm, whose ocean spreads
O'er coral rocks and amber beds,
Whose mountains pregnant by the beam
Of the warm sun with diamonds teem,
Whose rivulets are like rich brides,
Lovely, with gold beneath their tides,
Whose sandal groves and bowers of spice
Might be a Peri's Paradise!
But crimson now her rivers ran
With human blood—the smell of death
Came reeking from those spicy bowers,
And man the sacrifice of man
Mingled his taint with every breath

Upwafted from the innocent flowers.
Land of the Sun! what foot invades
Thy Pagods and thy pillared shades—
Thy cavern shrines and Idol stones,
Thy Monarchs and their thousand Thrones?

'Tis He of GAZNA—fierce in wrath
He comes and INDIA'S diadems
Lie scattered in his ruinous path.—
His bloodhounds he adorns with gems,
Torn from the violated necks
Of many a young and loved Sultana;
Maidens within their pure Zenana,
Priests in the very fane he slaughters,
And chokes up with the glittering wrecks
Of golden shrines the sacred waters!

Downward the PERI turns her gaze,
And thro' the war field's bloody haze
Beholds a youthful warrior stand
Alone beside his native river,—
The red blade broken in his hand
And the last arrow in his quiver.
"Live," said the Conqueror, "live to share
The trophies and the crowns I bear!"
Silent that youthful warrior stood—
Silent he pointed to the flood
All crimson with his country's blood,
Then sent his last remaining dart,
For answer, to the Invader's heart.

False flew the shaft tho' pointed well ;
The Tyrant lived, the Hero fell !—
Yet marked the PERI where he lay,
  And when the rush of war was past
Swiftly descending on a ray
  Of morning light she caught the last—
Last glorious drop his heart had shed
Before its freeborn spirit fled !

" Be this," she cried, as she winged her flight,
" My welcome gift at the gates of Light.
Tho' foul are the drops that oft distill
  On the field of warfare, blood like this
  For Liberty shed so holy is,
It would not stain the purest rill
  That sparkles among the Bowers of bliss !
Oh, if there be on this earthly sphere
A boon, an offering Heaven holds dear,
'Tis the last libation Liberty draws
From the heart that bleeds and breaks in her cause!"

" Sweet." said the Angel, as she gave
The gift into his radiant hand,
" Sweet is our welcome of the brave
  Who die thus for their native Land.—
But see—alas ! the crystal bar
Of Eden moves not—holier far
Than even this drop the boon must be
That opes the Gates of Heaven for thee !"

Her first fond hope of Eden blighted,
  Now among AFRIC'S lunar Mountains

Far to the South the PERI lighted
And sleeked her plumage at the fountains
Of that Egyptian tide whose birth
Is hidden from the sons of earth
Deep in those solitary woods
Where oft the Genii of the Floods
Dance round the cradle of their Nile
And hail the newborn Giant's smile
Thence over EGYPT's palmy groves,
Her grots, and sepulchers of Kings,
The exiled Spirit sighing roves
And now hangs listening to the doves
In warm ROSETTA's vale; now loves
To watch the moonlight on the wings
Of the white pelicans that break
The azure calm of MŒRIS' Lake.
'Twas a fair scene: a Land more bright
Never did mortal eye behold!
Who could have thought that saw this night
Those valleys and their fruits of gold
Basking in Heaven's serenest light,
Those groups of lovely date trees bending
Languidly their leaf-crowned heads,
Like youthful maids, when sleep descending
Warns them to their silken beds,
Those virgin lilies all the night
Bathing their beauties in the lake
That they may rise more fresh and bright,
When their beloved Sun's awake,
Those ruined shrines and towers that seem
The relics of a splendid dream,
Amid whose fairy loneliness

Naught but the lapwing's cry is heard,
Naught seen but (when the shadows flitting,
Fast from the moon unsheath its gleam,)
Some purple-winged Sultana sitting
Upon a column motionless
And glittering like an Idol bird!—
Who could have thought that there, even there,
Amid those scenes so still and fair,
The Demon of the Plague hath cast
From his hot wing a deadlier blast,
More mortal far than ever came
From the red Desert's sands of flame!
So quick that every living thing
Of human shape touched by his wing,
Like plants where the Simoom hath past
At once falls black and withering!
The sun went down on many a brow
Which, full of bloom and freshness then,
Is rankling in the pesthouse now
And ne'er will feel that sun agian.
And, oh! to see the unburied heaps
On which the lonely moonlight sleeps—
The very vultures turn away,
And sicken at so foul a prey!
Only the fierce hyena stalks
Throughout the city's desolate walks
At midnight and his carnage plies :—
Woe to the half-dead wretch who meets
The glaring of those large blue eyes
Amid the darkness of the streets!

"Poor race of men!" said pitying Spirit,
"Dearly ye pay for your primal Fall—
Some flowerets of Eden ye still inherit,
But the trail of the Serpent is over them all"
She wept—the air grew pure and clear
Around her as the bright drops ran,
For there's a magic in each tear
Such kindly Spirits weep for man!

Just then beneath some orange trees
Whose fruit and blossoms in the breeze
Were wantoning together, free,
Like age at play with infancy—
Beneath that fresh and springing bower
Close by the Lake she heard the moan
Of one who at this silent hour,
Had thither stolen to die alone.
One who in life where'er he moved.
Drew after him the hearts of many;
Yet now, as tho' he ne'er were loved,
Dies here unseen, unwept by any!
None to watch near him—none to slake
The fire that in his bosom lies,
With even a sprinkle from that lake
Which shines so cool before his eyes.
No voice well known thro' many a day
To speak the last, the parting word
Which when all other sounds decay
Is still like distant music heard:—
That tender farewell on the shore
Of this rude world when all is o'er,
Which cheers the spirit ere its bark

Puts off into the unknown Dark.
Deserted youth ! one thought alone
   Shed joy around his soul in death—
That she whom he for years had known,
And loved and might have called his own
   Was safe from this foul midnight's breath,—
Safe in her father's princely halls
Where the cool airs from fountain falls.
Freshly perfumed by many a brand
Of the sweet wood from India's land,
Were pure as she whose brow they fanned.

But see—who yonder comes by stealth,
   This melancholy bower to seek,
Like a young envoy sent by Health
   With rosy gifts upon her cheek ?
'Tis she—far off, thro' moonlight dim
   He knew his own betrothed bride,
She who would rather die with him
   Than live to gain the world beside!
Her arms are round her lover now,
   His livid cheek to hers she presses
And dips to bind his burning brow
   In the cool lake her loosened tresses.
Ah ! once, how little did he think
An hour would come when he should shrink
With horror from that dear embrace,
   Those gentle arms that were to him
Holy as is the cradling place
   Of Eden's infant cherubim !
And now he yields—now turns away,
Shuddering as if the venom lay
All in those proffered lips alone—

Those lips that then so fearless grown
Never until that instant came
Near his unasked or without shame.
"Oh ! let me only breathe the air,
  The blessed air, that's breathed by thee,
And whether on its wings it bear
Healing or death'tis sweet to me!
There—drink my tears while yet they fall—
  Would that my bosom's blood were balm,
And, well thou know'est, I'd shed it all
  To give thy brow one minute's calm.
Nay, turn not from me that dear face—
  Am I not thine—thy own loved bride—
The one, the chosen one, whose place
  In life or death is by thy side ?
Think'st thou that she whose only light
  In this dim world from thee hath shone
Could bear the long, the cheerless night
  That must be hers when thou art gone ?
That I can live and let thee go,
Who art my life itself ?—No, no—
When the stem dies the leaf that grew
Out of its heart must perish too !
Then turn to me my own love, turn,
Before like thee, I fade and burn ;
Cling to these yet cool lips and share
The last pure life that lingers there !"
She fails—she sinks—as dies the lamp
In charnel airs or cavern damp,
So quickly do his baneful sighs
Quench all the sweet light of her eyes.
One struggle—and his pain is past—

Her lover is no longer living !
One kiss the maiden gives, one last,
Long kiss, which she expires in giving.

" Sleep, said the PERI, as softly she stole
The farewell sigh of that vanishing soul,
As true as e'er warmed a woman's breast—
" Sleep on, in visions of odor rest
In balmier airs than ever yet stirred
The enchanted pile of that lonely bird
Who sings at the last his own death lay
And in music and perfume dies away !
Thus saying, from her lips she spread
Unearthly breathings thro' the place
And shook her sparkling wreath and shed
Such luster o'er each paly face
That like two lovely saints they seemed,
Upon the eve of doomsday taken
From their dim graves in odor sleeping :
While that benevolent PERI beamed
Like their good angel calmly keeping
Watch oe'r them till their souls would waken

But morn is blushing in the sky ;
Again the PERI soars above,
Bearing to Heaven that precious sigh
Of pure, self-sacrificing love.
High throbbed her heart with hope elate
The Elysian palm she soon shall win,
For the bright Spirit at the gate
Smiled as she gave that offering in ;
And she already hears the trees
Of Eden with their crystal bells

Ringing in that ambrosial breeze
That from the throne of ALLA swells ;
And she can see the starry bowls
That lie around that lucid lake
Upon whose banks admitted Souls
Their first sweet drught of glory take !

But, ah ! even PERI'S hopes are vain—
Again the Fates forbade, again
The immortal barrier closed—"Not yet,"
The Angel said as with regret
He shut from her that glimpse of glory—
"True was the maiden, and her story
Written in light o'er ALLA'S head
By seraph eyes shall long be read.
But, PERI, see—the crystal bar
Of Eden moves not—holier far
Than even this sigh the boon must be
That opes the Gates of Heaven for thee."

Now upon SYRIA'S land of roses
Softly the light of Eve reposes,
And like a glory the broad sun
Hangs over sainted LEBANON,
Whose head in wintry grandeur towers
And whitens with eternal sleet,
While summer in a vale of flowers
Is sleeping rosy at his feet.

To one who looked from upper air
O'er all the enchanted regions there,
How beauteous must have been the glow,
The life, the sparkling from below !

# PARADISE AND THE PERI.

Fair gardens, shining streams, with ranks
Of golden melons on their banks,
More golden where the sunlight falls;--
Gay lizards, glittering on the walls
Of ruined shrines, busy and bright
As they were all alive with light ;
And yet more splendid numerous flocks
Of pigeons settling on the rocks
With their rich restless wings that gleam
Variously in the crimson beam
Of the warm West,—as if inlaid
With brillants from the mine or made
Of tearless rainbows such as span
The unclouded skies of PERISTAN.
And then the mingling sounds that come,
Of shepherd's ancient reed with hum
Of the wild bees of PALESTINE,
Banqueting thro' the flowery vales ;
And JORDAN, those sweet banks of thine
And woods so full of nightingales.
But naught can charm the luckless PERI ;
Her soul is sad—her wings are weary—
Joyless she sees the Sun look down
On that great Temple once his own,
Whose lonely columns stand sublime,
Flinging their shadows from on high
Like dials which the wizard Time
Had raised to count his ages by !

Yet haply there may lie concealed
Beneath those Chambers of the Sun
Some amulet of gems annealed

In upper fires, some tablets sealed
  With the great name of SOLOMON
  Which spelled by her illumined eyes,
May teach her where benath the moon
In earth or ocean, lies the boon,
The charm, that can restore so soon
  An erring Spirit to the skies.

Cheered by this hope she bends her thither;
  Still laughs the radiant eye of Heaven,
  Nor have the golden bowers of Even
In the rich West begun to wither;—
When o'er the vale of BALBEC winging
  Slowly she sees a child at play,
Among the rosy wild flowers singing
  As rosy and as wild as they;
Chasing with eager hands and eyes
The beautiful blue damsel flies,
That fluttered round the Jasmine stems
Like winged flowers or flying gems:—
And near the boy, who tired with play
Now nestling mid the roses lay,
She saw a wearied man dismount
  From his hot steed and on the brink
Of a small imaret's rustic fount
  Impatient fling him down to drink.
Then swift his haggard brow he turned
  To the fair child who fearless sat,
Tho' never yet hath day beam burned
  Upon a brow more fierce than that,—
Sullenly fierce—a mixture dire
Like thunderclouds of gloom and fire;

In which the PERI'S eye could read
Dark tales of many a ruthless deed;
The ruined maid—the shrine profaned—
Oaths broken—and the threshold stained
With blood of guests!—*there* written, all,
Black as the damning drops that fall
From the denouncing Angel's pen,
Ere Mercy weeps them out again.

Yet tranquil now that man of crime
(As if the balmy evening time
Softened his spirit) looked and lay,
Watching the rosy infant's play:—
Tho' still whene'er his eye by chance
Fell on the boy's, its lurid glance
  Met that unclouded, joyous gaze,
As torches that have burnt all night
Thro' some impure and godless rite,
  Encounter morning's glorious rays.

But, hark! the vesper call to prayer,
  As slow the orb of daylight sets,
Is rising sweetly on the air,
  From SYRIA'S thousand minarets!
The boy has started from the bed
Of flowers where he had laid his head
And down upon the fragrant sod
  Kneels with his forehead to the south
Lisping the eternal name of God
  From Purity's own cherub mouth,
And looking while his hands and eyes
  Are lifted to the glowing skies

Like a stray babe of Paradise
Just lighted on that flowery plain
And seeking for its home again.
Oh ! 'twas a sight—that Heaven—that child—
A scene, which might have well beguiled
Even haughty EBLIS of a sigh
For glories lost and peace gone by !

And how felt *he*, the wretched Man
Reclining there—while memory ran
O'er many a year of guilt and strife,
Flew o,er the dark flood of his life
Nor found one sunny resting place,
Nor brought him back one branch of grace.
" There *was* a time," he said, in mild,
Heart-humbled tones—" thou blessed child
When young and haply pure as thou
I looked and prayed like thee—but now——"
He hung his head—each nobler aim
  And hope and feeling which had slept
From boyhood's hour that instant came
  Fresh o'er him and he wept—he wept !

Blest tears of soul-felt penitence !
  In whose benign, redeeming flow
Is felt the first, the only sense
  Of guiltless joy that guilt can know.
" There's a drop," said the PERI, that down from the moon
Falls thro' the withering airs of June
Upon EGYHT'S land, of so healing a power,
So balmy a virtue, that even in the hour

That drop descends contagion dies
And health reanimates earth and skies!—
Oh, is it not thus, thou man of sin,
  The precious tears of repentance fall?
Tho foul the fiery plagues within
  One heavenly drop hath dispelled them all!"

And now—behold him kneeling there
By the child's side, in humble prayer,
While the same sunbeam shines upon
The guilty and the guiltless one,
And hymns of joy proclaim thro' Heaven
The triumph of a Soul Forgiven!

'Twas when the golden orb had set,
While on their knees they lingered yet,
There fell a light more lovely far
Than ever came from sun or star,
Upon the tear that, warm and meek,
Dewed that repentant sinner's cheek.
To mortal eye this light might seem
A northern flash of meteor beam—
But well the enraptured PERI knew
'Twas a bright smile the Angel threw
From Heaven's gate to hail that tear
Her harbinger of glory near!

"Joy, joy forever! my task is done—
The Gates are past and Heaven is won!
Oh! am I not happy? I am, I am—
  To thee, sweet Eden! how dark and sad
Are the diamond turrets of SHADUKIAM.
  And the fragrant bowers of AMBERABAD!

"Farewell ye odors of Earth that die
Passing away like a lover's sigh;—
My feast is now of the Tooba Tree
Whose scent is the breath of Eternity!

"Farewell, ye vanishing flowers that shone
  In my fairy wreath so bright and brief;—
Oh! what are the brightest that e'er have blown
To the lote tree springing by ALLA'S throne
  Whose flowers have a soul in every leaf.
Joy, joy forever,—my task is done—
The Gates are past and Heaven is won!"



Scape & Co., Printers, Cocanada.